మోదశమనప్రకారకశుభోదయకారకదివ్యనాముఁ డం
బాదయితుండు దృఙ్మహితఫాలుఁడు శ[illegible]ఁడు భక్తియుక్తికిన్.

427. క. యోగీంద్రుచిత్తకమలా
భోగమధుపవిభుఁడు ప్రకృతిపురుషాత్ముఁడు ని
రోగస్వరూపుఁ డవ్య
క్తాగోచరుఁ డధికసులభుఁ డమలాత్ముఁడతన్.

428. ఉ. నీలగళుండు శంకరుఁడు నిత్యుఁడు సర్వసురాగ్రజుఁ డుజ్జ్వల
త్కాలమహానలప్రశమకప్రచురామృత[1]వృష్టివిస్ఫుర
ద్బాలమృగాంకశేఖరుఁడు దైత్యకుల[2]ప్రవిదారణక్రియా
లోలపరశ్వథుండు [3]సకలుం డమలుండు ప్రియుండు శాంతికిన్.

429. వ. అని ప్రశంసించి [1]కవ్వడి గనినవాఁడు రుద్రుం డగుటఁ దేటపఱచి దక్షమఖ మథనత్రిపురమర్దనాదు లగు నద్దేవునిదివ్యలీల లుపన్యసించి మహాదేవపశుపతి శివప్రముఖంబు లగు తదీయభవ్యనామంబులకుం బ్రవృత్తినిమిత్తంబు లగు నర్థంబులు దెలియ [2]నిర్వచనంబు సేసి యట్టిపరమేశ్వరుండు నీకు వరదుం డయి సన్నిధి సేసె నతనిం గని వెన్నిధిఁ గన్న పేదవోలెం గృతార్థుండ వై తయ్యంధకాసురభంజనుకతంబున గడిందిపగ అడంగుదు రయ్యాదిమ్మ ధ[3]నుర్ధరుం డివ్విధంబున వైరివధం బాపాదింప నీకు గెలుపు గొనుట సుకరం బయ్యె నీతపంబు పెంపునం దొల్లి సన్నిహితుం డై నీకుం బ్రియంబుగా దివ్యాస్త్రంబు లొసంగె నంతటం దనివి సనక యిత్తెఱంగున భక్తపరాధీన త్వంబు ప్రకటించె నీవు [4]పుణ్యాత్ముండ వప్పరమాత్ము నాత్మ నిలిపి నమస్క రింపు మాసర్వలోకశరణ్యు శరణంబు సొరు మక్కరుణాకరుండు శరణా

428. 1. దృష్టి – కొన్ని ప్రతులు. 2. ప్రళయాంతకక్రియా – ల. 3. కుశలుండు గలం డ్ఘుతాపశాంతికిన్ – స; డచలుం డమయుండు – ల.

429. 1. కవ్వడిసే ఁ గనినవాఁడు రుద్రుం డని తేటపరచి – వ. వీ. శ. మ. 2. వ్యుత్పన్నం బులు సేసి – కొన్ని ప్రతులు. 3. మహావీరుండు – కొన్ని ప్రతులు. 4. మహాభా గుండ – ఇ.

గతులకు నాయురారోగ్యైశ్వర్యాదిసకలాభిమతంబులు నిత్యంబులుగాఁ బ్రసాదించు నని నిర్దేశించిన నయ్యర్జునుండు దండప్రణామపూర్వకంబుగా భక్తిరసాయత్తం బగుచిత్తంబునం [5]జంద్రధరు నెలకొలిపి సాంద్రానందం బనుభవించి సాత్యవతేయుచరణంబుల కెఱఁగిన నమ్మునీంద్రుం డయ్యింద్ర నందను నభినందించి సుఖవి గమ్మని దీవించి విజయంచేసె నని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు.

430. క. మునివర ద్రోణుని[1]వృత్తము
వినిసంతుష్టుండ నైతి విను వేడుక నా
మనమునఁ దోడ్తో నొదవెడు
వినిపింపు దగంగ మీఁదివృత్తాంతంబున్.

431. వ. అని యడుగుటయు.

432. చ. అమరకిరీటకోటి[1]కలితారుణరత్నమరీచివీచికా
సముదయఖేల[2]నోల్లసనచారుపదాంబుజకాంతిపూర దు
ర్దమ[3]దనుసూనుసంచయవిదారణ చిత్తవిహారబోధనా
గమహితనాదనిర్వహణకౌతుక[4]విశ్రుత రక్షితాశ్రితా.

433. క. [1]జనవినుత బాదరాయణ
మునీంద్ర వాగమృతనిధిసముద్భూతాహ్లా
దనకీర్తిసుధాకిరణా
వినతాఖిలభద్రకరణ విశ్రుత[2]చరణా.

5. నిందుధరు - కొన్ని ప్రతులు.

430. 1 వర్తన - కొన్ని ప్రతులు.

432. 1. ఘటితారుణ - బ. వ. 2. నోల్లసిత - వ. శ. ష. కొన్ని ప్రతులు. 3. దను జానుశాసన విధానత ప్రవిత్తవిహార - స. 4. విశ్రుత - అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు; మిశ్రిత - వా.

433. 1. వినుతిపర - క. ఖ. హ; వినుతపద - కొన్ని ప్రతులు. 2. కరుణా - కొన్ని ప్రతులు.

434. మాలిని అమృతమయవిలాసా యోగ[1]భాస్వద్విలాసా
విమలహృదయరమ్యా [2]వీతరాగాదిగమ్యా
కమలభవనమస్యా గౌరవాధిక్య[3]శస్యా
శమదమపరివర్తీ శాశ్వతానందమూర్తీ.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య
పుత్ర, బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం
బయిన శ్రీమదాంధ్ర మహాభారతంబున
ద్రోణపర్వంబునందు సర్వంబును
బంచమాశ్వాసము.

శ్రీమదాంధ్ర మహాభారతము నందలి ద్రోణపర్వము సంపూర్ణము



434. 1. భాస్వద్విలాసా – వ; భోగోద్వికాసా – వా. 2. విశ్రుతజ్ఞాన శమ్యా – ఏ. ర. వేదసారానుగమ్యా – వ. 3. సేవ్యా – కొన్ని ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మ పర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

## ఈ



## ఉ

## ద

— (o) —

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

## ఇ

## ఈ



## ఉ

| పద్యము | పుట | పద్యము | పుట |
|---|---|---|---|

# త

## న

### బ

## శ